సొంత అన్నగారిలా భావించేవాడు. నేను మాత్రం అతణ్ణి విద్యా జ్యేష్ఠుడనుకునే వాడిని. అతడి తండ్రి రాజోద్యోగి, బుద్ధ భక్తుడు కావడం వల్ల కొడుకును ఏడవ ఏటనే మహావన విహారంలో శ్రమణుడిగా చేర్పించాడు. వయస్సు వచ్చాక జిన యశుడు ఉపాధ్యాయుడుగా, జ్ఞాన భద్రుడు ఆచార్యుడుగా భిక్షు దీక్షను స్వీకరించాడు జినగుప్తుడు. త్రిపిటకాలనూ పఠించాడు. కవిత్వ అభిరుచి కూడా బాగానే వుంది. 27 సంవత్సరాల వయస్సొచ్చాక మత ప్రచారార్థం విదేశ యాత్రల్ని ప్రారంభించాడు. మొదట గంధార దేశాన్నుండి కపిశకు వెళ్ళాడు. అక్కడ్నుండి హిమాలయాన్ని దాటి కాంస్య దేశం మీదుగా చీనాదేశానికి రావాలని సంకల్పించుకున్నాడు. సంకల్పాన్ని కార్యరూపంలో పెట్టాడు కూడాను. మొత్తం పదిమంది ఈయాత్రలో పాల్గొన్నారు. కానీ, ఛాన్ చావూ వరకు వచ్చేసరికి నలుగురు మాత్రమే మిగిలారు. ఆరుగురు చనిపోయారు. జినగుప్తుడు మూడు సంవత్సరాలపాటు ఈ ఛాన్ చావూలో వున్నాడు, తరువాత చావూవంశపు చక్రవర్తి మింగ్ పరిపాలిస్తున్న సమయంలో ఛాంగ్–అన్‌కు వచ్చి, చావూ–యాంగ్ విహారంలో దిగాడు. మొదట్లో సుఖంగా గడిచినా, తరువాత చీనాదేశాన్ని వీడి వెళ్ళవలసిన వాడయ్యాడు. (క్రీ. శ. 572–82 లో) త్యోర్కు–రాజ్యం గుండా మాతృదేశానికి ప్రయాణం చేశాడు. త్యోర్కు–మహారాజయిన తోపా ఖాన్ జినగుప్తుణ్ణి తనరాజ్యంలోవుండి ధర్మప్రచారం చేయవలసిందని ప్రార్థించాడు. జినగుప్తుడు తన అనుచరులైన జినభద్ర, జినయశులతో త్యోర్కు–రాజ్యంలో పదిసంవత్సరాలు వున్నాడు. ఇంతలో చావూవంశం పతనమైందనీ, సు ఈ వంశం అధికారాన్ని చేపట్టిందనీ తెల్సింది. మళ్ళీ వెనక్కి తిరిగి చీనా దేశానికి వచ్చాడు, వెనుక ఈ దేశంలో వున్నప్పుడు మూడు వేల శ్లోకాలుగల నాలుగు గ్రంథాలను అనువాదం చేశాడు. ఈ మాటు కూడా జినగుప్తుడు తన సమయాన్నంతా అనువాదం కోసమే వినియోగించాడు. జినగుప్తుడు గొప్పపండితుడు. చీనీ, తుర్కీ–రెండు భాషల్లోనూ

అతడు అపారంగా జ్ఞానాన్ని సంపాయించాడు, నేను మొత్తం 15 గ్రంథాలను అనువాదం చేశాను. వాటి మొత్తం శ్లోకాల సంఖ్య 50 వేలుంటుంది. జినగుప్తుడు 175 లక్షల 50 వేల శ్లోకాలను అనువాదం చేశాడు. అశ్వఘోషుడి బుద్ధ చరితాన్ని అతిసుందరంగా అనువాదం చేశాడు, పాఠకులకు మూలగ్రంథాన్ని చదువుతూన్న అనుభూతి కలుగుతూంది. "సద్ధర్మ పుండరీకం" లాంటి సూత్రాలను కూడా ఎన్నిటినో అనువాదం చేశాడు, నేనీ మాటు ఛాంగ్-ఆన్‌కు వచ్చాక అనువాదాల్ని చేయలేదు, వెనుక చేసినవే 45 వేల శ్లోకాలుగల ఎనిమిది గ్రంథాలున్నాయి, వాటితోనే సంతృప్తిపడి పూరుకున్నాను.•

ఒక్క జినగుప్తుడూ, నేనే కాదు. వేల సంఖ్యలో భారతీయ బౌద్ధ భిక్షువులు చీనా దేశానికి వచ్చారు. మత ప్రచారాన్ని చేశారు. ఇన్ని వేల మందీ అనువాదాలే చేయలేదు. కొందరు వైద్యులుగా ప్రజలకు సేవచేస్తూ జీవితాన్ని గడిపారు. కొందరు అధ్యాపన కార్యాన్ని నిర్వహించారు. మరి కొందరు కేవలం ఉపన్యాసాలనిస్తూ ధర్మ ప్రచారానికి సహకరించారు. గ్రంథానువాదాల్ని చేయకపోయిన మాత్రాన వీరిని మర్చిపోవడం తగదు. మేము అనువాదం చేసిన గ్రంథాల్లో ఏవైనా భవిష్యత్తరాల వారికి లభించి, చీనా దేశంలో జరిగిన బౌద్ధమత ప్రచారం సందర్భంగా మమ్ముల్ని జ్ఞాపకం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడ్డప్పుడు, అనామకులుగా, అసంఖ్యాకులుగా వున్న పై భిక్షువుల్నికూడా జ్ఞప్తికి తెచ్చుకోవడం ఉచితమూ, న్యాయమూ అనుకుంటున్నాను.

• • • •

•జినగుప్తుడు అనువాదంచేసిన గ్రంథాల్లో ఇప్పటికీ నిలచివున్న గ్రంథాలు 1. 'సద్ధర్మ పుండరీక' 2. 'నానా సంయుక్త మంత్రసూత్ర' నరేంద్ర యశునాడు అనువాదంచేసిన గ్రంథాలు 1, సూర్యసూత్రం, 2, మంజుశ్రీ విక్రీడిత సూత్రం, 3. మహామేఘసూత్రం, 4. శ్రీగుప్తసూత్రం, 5. బల వ్యూహసూత్రం, 6, శతబుద్ధసూత్రం, 7. స్థిరమతిసూత్రం.

## ఉపసంహారం!

నరేంద్రుడిక లేడు. ఇహ జీవన యాత్రను చాలించాడు. వేన్ – తీ రాజ్యానికి వచ్చిన ఎనిమిదవ సంవత్సరంలో (క్రీ.శ. 589) ఒకనాడు, సహజంగా, కూర్చున్నవాడు కూర్చున్నట్టు కన్నుమూశాడు. ఏ జబ్బూ లేదు. పండు పండి రాలినట్టయింది. నా పేరు జినగుప్తుడు. నామీద వుండే ప్రేమవల్ల నరేంద్రుడు నా గురించి పొగుడుతూ వ్రాశాడు. అతడిచే పొగడ్తల్ని పడసే యోగ్యత నాకే విధంగానూ లేదని అనుకుంటున్నాను. అతడు చేసిన మహాయాత్రలముందు నా యాత్ర లెంత? నేను పడ్డ బాధలుమాత్రం ఏమున్నాయి? ఇక గ్రంథానువాదాలంటారా? అతడు తలచుకుంటే నాకంటె కూడా ఎక్కువ శ్లోకాలను అనువాదం చేసేవాడు! నరేంద్రుడు అవలోకితేశ్వరుడిలాగనే (క్వాన్–యిన్) దయాసముద్రుడు. అతడు తన యాత్రానుభవాల్ని, భవిష్యత్తరాలవారి ఉపయోగార్థం గ్రంథస్థం చేశాడు.

నరేంద్రుడు 'అజాత శత్రువు' అనతగినవాడు. నేను గంధార దేశంలో పుట్టాను. నరేంద్రుడు ఉద్యానదేశవాసి! గంధారం, ఉద్యానం, రెండూ ఇరుగు పొరుగు దేశాలు. కనుకనే మా స్నేహం ఇంత ప్రగాఢమైంది. నరేంద్రుడి స్నేహాన్ని, వాత్సల్యాన్ని పొందడానికి అందరూ సమానులే! మానవుల పట్లే కాకుండా, సమస్త జీవరాసులపట్లా అతడు అపారమైన దయను ప్రదర్శిస్తుండేవాడు. కానీ, అతడు నా పట్ల తన పొరుగు దేశస్థుడన్న ప్రత్యేకమైన శ్రద్ధనూ, అభిమానాన్నీ ప్రదర్శిస్తూండేవాడు. సమదర్శి, దయామయుడూ అయిన నరేంద్రుణ్ణి గురించి పై వాక్యాన్ని వ్రాసినందుకూ, వ్రాయవలసి వచ్చినందుకూ చాలా బాధపడుతున్నాను. అయినా, చంద్రుడిలోని మచ్చలా అతడి మహోన్నత వ్యక్తిత్వపు సౌంద

ర్యాన్ని పై వాక్యం ఇనుమడింపచేస్తుందేగాని. హీనపర
కుంటున్నాను.

నరేంద్రుడు చనిపోయాడన్న వార్త క్షణంలో రాజధానిలో వ్యాపించింది. రాజధానిలోని ప్రజలందరూ శవయాత్రలో పాల్గొన్నారు. విషాదవదనులై, సాశ్రునేత్రాలతో అందరూ శవం వెంటనడిచారు. శవయాత్రలో పాల్గొన్నవాళ్ళల్లో వివిధ వర్గాలకూ, వృత్తులకూ చెందినవారే కాక, వివిధ దేశాల ప్రజలుకూడా వున్నారు. త్యోర్కు, కూచీ, కుస్తన్, తుఖార్ మొదలుగా గల అనేక దేశాల ప్రజలు కన్నీరు కారుస్తూ శవయాత్రలో పాల్గొన్నారు. నరేంద్రుడి శవానికి యథావిధిగా దహనక్రియలు జరిపాము. అతడి అస్థి ధాతువులతో స్తూపాన్నొకదాన్ని నిర్మించాము. అతడి జ్ఞాపకాలను శాశ్వతం చేయడానికి అవసరమైన జాగ్రత్తలను తీసుకున్నాము. నరేంద్రుడు లేడుగనుక సరిపోయింది. అతడుంటే మమ్మల్నిలా చేయనిచ్చేవాడుకాదు. అతడికి శాశ్వతత్వం మీద నమ్మకంలేదు. క్షణికవాది. సర్వప్రాణులూ సుఖంగా వుండాలన్నది నరేంద్రుని మహోన్నత ఆదర్శం.

సంపూర్ణం.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B110 |
| పుస్తకం పేరు | విస్మృత యాత్రికుడు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 503 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 500 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Asiwini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |